శ్రీ రస్తు.

శ్రీ వేంకటాద్రిస్వామినే నమః.

శ్రీ ఘ టి కా చ ల

# లక్ష్మీనృసింహనామ సంకీర్తనలు.



ఈ గ్రంథము,

మాంబళం-శ్రీమాన్, వేంకటవరదయ్యాస్వాములవారి

శిష్యుండునగు

తిరువళ్ళూరు, బుస్సా - రాఘవదాసుగారిచే,

రచియించి ప్రచురింపంబడియె.

1915.

 (అణా 1.

"MURAHARI" Press, Madras.

శ్రీ ర స్తు.

శ్రీమత్ వెంకటవరదయ్యస్వామి సద్గురుభ్యోనమః.

శ్రీ ఘ టి కా చ ల

# లక్ష్మీనృసింహస్వామి సంకీర్తనలు



చెంగల్పట్టుజిల్లా, తిరువెవ్వళూరు

శ్రీవీరరాఘవస్వామి సన్నిధానమునకు సమీపమున

ఐవేలిఅగరం గవడ్లవీధి, 1-వ నెంబరు, కవాటమందు

బుస్సా- గురువప్పనాయుని వారివలన కట్టి స్థాపింపబడిన

శ్రీగోపాలకృష్ణ శ్రీపాండురంగస్వామి హరిభజన మందిరంబునందు

పైవారి జ్యేష్టపుత్రుండును

శ్రీమాన్, తిరుమలకుమార తోళ్ళప్పతాతాచార్యులవారి

తిరువడి సంబంధుడును

మాంబళం- శ్రీమాన్, వేంకటవరదయ్య స్వాములవారి

శిష్యుండునునగు

బు స్సా - రా ఘ వ దా సు చే,

లక్ష్మీనృసింహస్వామి ప్రేరణగలిగి రచియించి

పండితులచే సరిచూడబడి

---

మురహరి ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రచురింపంబడియె.

---

శ్రీనిధర)

చెన్నపట్టణము.

Registered Copy Right.



శ్రీ ర స్తు.

శ్రీ రామ రామ రామ

    

శ్రీ ఘ టి కా చ ల

# లక్ష్మీనృసింహ నామ సంకీర్తనలు.

## శ్రీఘటికాద్రి లక్ష్మీనృసింహస్వాముల స్తోత్రము.

1. శ్రీఘటికాద్రిని సుస్థిరముగ నెలకొన్న
శ్రీనరసింహా మహాప్రభో
కోట్యర్క ధామ నేడొక్క నామాట
యాలకించుమి నార సింహప్రభో॥ శ్రీఘ.

2 మోహసంసారాంధ కారములో మునిగి
మోసబోయున్న నార సింహప్రభో
దేహ వాసనలో మరుగనీక నన్ను
మన్నించి బ్రోవు నార సింహప్రభో॥ శ్రీఘ.

3. కమనీయగాత్ర కామాదుల చేనన్ను
కట్టుబడనీక నార సింహప్రభో
కోమలాంగనే కోరినవరములు
కోపింపకివ్వరా సింహప్రభో॥ శ్రీఘ.

4. ఆరేట మూడిట నేనలసట బడలేక నిన్నే
శరణుజొచ్చి యున్న సింహప్రభో
హారిసిద్ధ మహిమను వర్ణించనేనెంత వా
దరా శ్రీ నార సింహప్రభో॥ శ్రీఘ.

5. అనుదినమునునీ సహాయము దప్ప
నేనన్యమెరుగ నార సింహప్రభో
నీలోను నాలోను మెల్లనునీవై
వెలుగుచుయున్నావే సింహప్రభో॥ శ్రీఘ.

6. జేసినవిశాపద భక్తులసేవనే
జేయుచుండవలె సింహప్రభో
గాసి జెందబోను హఠయోగవేష నామ
స్మరణజేసెద నార సింహప్రభో॥ శ్రీఘ.

7. వలదురా చలము వైకుంఠపురవాసా
జలజదళముపై గూర్చున్న సింహప్రభో
చాలదురా భక్తి చోళంఘిపురీశా .
సదా దలచెద నార సింహప్రభో॥ శ్రీఘ.

8. కాపాడతండ్రి నే నీపాదుపడనేల
ఓపిక లేదు మనసు సింహప్రభో
శ్రీవ భూపనీప్రాపె గోరి యున్న నా
యార్తిని తప్పించు సింహప్రభో॥ శ్రీఘ.

9. గుట్టు తెలియకనే రట్టుజేసెదనని నన్ను
బట్టి ద్రోయకరా సింహప్రభో
నీ కొట్టులకు తిట్టులకు నేనోర్వనట్టి పా
పిష్టినైతిగా నార సింహప్రభో॥ శ్రీ.

10. కందర్ప శతకోటి　　లావణ్యాధీరా నా
యందు సదానందు　　సింహప్రభో
సందర్భమేదో బెట్టి　　నిందకాయక
నందుడై పూజలందు　　సింహప్రభో॥ శ్రీ.

11. నీనామ స్మరణచు　　సదా నములుచుండ
నిర్మలమతినిరా　　సింహప్రభో
దినములుపోతుంది　　ఏదిక్కుగానక నిన్నె
దిక్కని నమ్మితి　　సింహప్రభో॥ శ్రీ.

12. చక్కనివనితల జూచి　　వెక్కసపడియున్న నన్ను
చక్కజేయరా నార　　సింహప్రభో
లెక్కలేని బాధలు　　బెట్టితేరు
నేనెక్కడబోదు నార　　సింహప్రభో॥ శ్రీ.

13 తనువులో ప్రాణము　　తత్తరబడక మునుపే
నీతావు జేరియున్న　　సింహప్రభో
తాను తానై　　సర్వము తానై
యని నిలచెదెన్నడో　　సింహప్రభో॥ శ్రీ.

14. నేననెమమకారములు　　పోగొట్టినే
నాణ్యుడై య్యేటెన్నడో　　సింహప్రభో
నినుగనిముచ్చట లాడుచు　　పాడుచునుండేటి
వర్ణనజేయరా　　సింహప్రభో॥ శ్రీ.

15. అండపిండ　　బ్రహ్మాండంబులో నిండి
యానంద మాడేవ　　సింహప్రభో
కొండజేరి నిన్ను　　గొలుచువారికి
కందు ఫలాలిచ్చి రక్షించె　　సింహప్రభో॥ శ్రీ.

16. యెవరంట రానివుండు యెక్కడనుండట
యీవివరము దెల్పరా సింహాద్రిప్రభో
దేవరా నీవు కృపతో గావరా
సేవేహం సేవేహం సింహాద్రిప్రభో॥ శ్రీ.

17. కరిధ్రువసేలిన యీ కరుణరస మర్యాద
కపట మనసుమాను నార సింహాద్రిప్రభో
హరిహరి హరిహరి హరిహరి సదా
హరిహరి యందును సింహాద్రిప్రభో॥ శ్రీ.

18. యేగి నీశౌర్య మెక్కడదాగెను
మీరూపు జూపరా సింహాద్రిప్రభో
గారీశ స్తుతపాత్ర నాగర్వములనెంచి
దూరానయుండక సింహాద్రిప్రభో॥ శ్రీ.

19. విమలరూప నా భ్రిమలతొలగజేసి నీ
సీమంబియ్యరా సింహాద్రిప్రభో
నిమల నిర్మలనిత్య శుభదశరీరా యీ
శ్రమ యోర్వలేను సింహాద్రిప్రభో॥ శ్రీ.

20. శ్రీరమామనోహరా నామనోవ్యాధిసకని
నివృత్తిజేసే వారెవ్వరు సింహాద్రిప్రభో
మమ హృదయవాసా యీ మాయవాదుల
చే మరిగి చెడియున్న సింహాద్రిప్రభో॥ శ్రీ.

21. నరమృగరూపుడై హిరణ్యకశ్యపుని పొట్ట
చిరగ చీల్చినట్టి సింహాద్రిప్రభో
కరధృత ఖడ్గ ఓం. కార నిలయా
ఘోరుడై శైలసేటి సింహాద్రిప్రభో॥ శ్రీ.

22. వరయోగి కవీంద్రు మునిపుంగవాదులకు నిత్య
వరుడై యుండేటి సింహాద్రిప్రభో
పరమాత్మ నీపద భక్తినిసలిపేను ప
దరక చెదరక చేయి సింహాద్రిప్రభో॥ శ్రీ.

23. ధరలోన నీవంటి దొరకు నేనెందుగాన
ధీరా, దధిచోరా సింహాద్రిప్రభో
దూరిన తెచ్చిన నీదేభారము తండ్రి నే
దోద్ధారా నార సింహాద్రిప్రభో॥ శ్రీ.

24. తొమ్మిది వాకిళ్ళ కీల్బొమ్మరా దీని గట్టిగ
నమ్మలేను సింహాద్రిప్రభో
స్వామి నందును శుద్ధ సాత్వికునిగా జేయు
నమ్మ గొలిచేను సింహాద్రిప్రభో॥ శ్రీ.

25. పొమ్మనినాపోను నన్ను పోషించేదొర ప్రకార
కర్మిని ద్రోహిని సింహాద్రిప్రభో
యిమ్మహి నీసేవ నెమ్మతిగా జేయ స్థి
రమతి నియ్యరా సింహాద్రిప్రభో॥ శ్రీ.

26. కర్పూరహారతులు నింపుగొనిచ్చేను
అప్రమేయ వరదా సింహాద్రిప్రభో
సర్పశయన నా నేర్పు నేరము లెంచి
తిప్పలో బెట్టకురా సింహాద్రిప్రభో॥ శ్రీ.

27. ఓర్పుతో రారా ఓం మహాలక్ష్మి నాథా
యింత ఒయ్యారమేమిరా సింహాద్రిప్రభో
ఆర్పరాదుఃఖము నీనామ మంత్రమునదా
ప్రవృత్తిజేసెద సింహాద్రిప్రభో॥ శ్రీ.

28. సుగుణ నిర్గుణలీల సుగుణముల నెం
చి కొనియాడ నేనా సింహప్రభో
సకునోపాళములచే నీపదవి సాధించలేక స
ద్భక్తితో వేడెద సింహప్రభో॥ శ్రీ.

29. తగునా నన్నిటు చిక్కులబెట్టుట నాతో
తగునేల బిగువేల సింహప్రభో
ఖగవాహనుడై భవ రోగములను
వేగ బారదోలవే నారసింహప్రభో॥ శ్రీ

30. మందరధర నే మందమతుడై యున్న
యిందీవరశ్యామా సింహప్రభో
కందురనీమోము కంతుజనక ఓ
కుంద కుట్మలవదన సింహప్రభో॥ శ్రీ.

31. సుందరమృదుపదా నా ముందర రావయ్యా
వందనమిదుగో సింహప్రభో
యెందురయున్నావు యే కాంతమునసీతో
పొందుగమాట్లాడవలెరా సింహప్రభో॥ శ్రీ.

32. యిందున అందున యెందుయున్నావనిశ్రుతు
లందు బల్కగవింటి సింహప్రభో
యిందులోయుండి నన్నేలబాధించేవు నీ
పొందు యిదేనా సింహప్రభో॥ శ్రీ.

33. బంధమై యున్న పాతకము లన్నీటెని
బంధించివేయరా సింహప్రభో
బాంధులుండేవాడు వెళ్ళిపోవకమునుపు నీ
యందే ధ్యానముంచు సింహప్రభో॥ శ్రీ.

34. విద్య చేసిన్ను విశదముగాకీర్తించ నాకు
విద్య చాలదురా నారసింహప్రభో
పద్య కావ్యముచేసి పాడుచుంటామంటె
గద్యపదము లెరుగనే సింహప్రభో॥ శ్రీ.

35. ఆద్యంతరహితా అచ్యుతానంత నా
స్సాధ్యమానుతింప సింహప్రభో వేద
వేద్యానీ నిద్దంపు మోమును
సద్యాసదా జూచెద సింహప్రభో॥ శ్రీ.

36. బాల్యావస్థలచే కొన్ని దినములుగడిపితి
కల్యాణంతే భవతు సింహప్రభో
తుల్యమైన నీ మనసింతక తన్నమా
హాల్య తులసీదళాక్ష సింహప్రభో॥ శ్రీ.

37. మాల్యాభిరామ మారుతనుతభీమ మై
థిల్యాలోచనయోగ్య సింహప్రభో
శల్యముల్ప్రాపక జలచరాచరములు పరి
శీల్యమై జ్వలియించే సింహప్రభో॥ శ్రీ.

38. మూర్ఖవాదము గాదు ముల్లోకధారాయిది
దుర్గంధతిత్తిరా సింహప్రభో
దుర్గంధతిత్తిలో దోరమైగూర్చున్న హేతు వి
సర్గముగా జెప్పు సింహప్రభో॥ శ్రీ.

39. దుర్మార్గవృత్తిలో జొరబడకనే స
న్మార్గముబట్టితి సింహప్రభో స
న్మార్గులపొందు జన్మసఫలమౌను
దీర్ఘాయిూజన్మమందేరా సింహప్రభో॥ శ్రీ.

40. కర్మ పాశమునన్ను కడ తేర్చుకున్నది
జన్మాంతర కర్మమా సింహప్రభో
ధర్మ సంసేవితా దాసోహం సదాయోగా
నిర్మలం బియ్యరా సింహప్రభో॥ శ్రీ.

41. మర్మస్థానమున మరిమరి దూరుచు
చర్మక్రియలు జేయుచున్న సింహప్రభో
వర్మమా ధర్మమా మర్మమా కర్మమాయా
నిర్మల స్తుతినీరా సింహప్రభో॥ శ్రీ.

42. హాటకాంబర ధారి నీసాటి లేరని నీపై
పాటలుపాడెద సింహప్రభో
పాటలుపాడి నీ సాటుజొచ్చితి నీ
భటుడనురారా సింహప్రభో॥ శ్రీ.

43. భటుని వేగ బట్టి పాలించకున్న యా
కుటిల మెవ్వరిదో సింహప్రభో
నటనమాడుచు దివ్య నామసంకీర్తన
దిటవుగ జేసెద సింహప్రభో॥ శ్రీ.

44. సాహసౌందర్య వుత్సాహ దివ్యప్ర
భా హోమనీమజవలతవము లెరుగ సింహప్రభో
సోహం అంసోహం సోహం అంసోహం
సోహం అంసోహంసోహం సింహప్రభో॥ శ్రీ.

45. హాహాహా యీదేహ మందే నినుగన
ఆహారనిద్ర విసర్జించు సింహప్రభో
యాహారనిద్ర. విసర్జించి నీ సన్నిధి జేర్చను
సహజంబుగా రావే సింహప్రభో॥ శ్రీ.

46.గురుడాడినట్టి యీ మూలమంత్రమును
ధరా యేలపఠించేది సింహప్రభో
ధీరుడాగురుబోధ యెట్టిదో యెరుగను
అరయజెప్పరా నార సింహప్రభో॥ శ్రీ.

47.గురుకంటె వేరె దైవము లేదని నీవు
గుట్టువై జెప్పగావింటి సింహప్రభో యీ
గురుడే నేనై నేనే నీవైయున్న స
ద్గురుడాచూడిదో సింహప్రభో॥ శ్రీ.

48.నీవాడై నేనుండి జడ పదార్థముల
విడచి బెట్టవలె సింహప్రభో
గడచిన నేరము లెంచి చూడక
కదు వేడ్కతో రావే సింహప్రభో॥ శ్రీ.

49.చూడచూడ నాలో గడిబిడి జేసేవు
చూప్కులందే జూపు సింహప్రభో
వడవడ వణకుచు ఒళ్ళు దెలియకున్న నీ
వాడనిననుపించు సింహప్రభో॥ శ్రీ.

50.యెండమంచు వానలకుజడియక నీ
యండ జేరవలెనంటె సింహప్రభో యీ
మొండిజీవము యెండగాలివానలకు
య్యుండిగొలువదే సింహప్రభో॥ శ్రీ.

51.చండదోర్దండ వేదండసంరక్ష మా
ర్తాండనిలయ నార సింహప్రభో
ఖండితముగా నేనుండుచోట
నుండి బంధించివేతును సింహప్రభో॥ శ్రీ.

52. అదుగో వచ్చెదనని ఇదుగో వచ్చెదనని
బెదురుజూపె వేరా సింహప్రభో
పదుగురు జేరి నిన్నా గ్రితో వేడ యు
తి దరుసుగ రారా సింహప్రభో॥ శ్రీ.

53. ఆదుకొన్న యానందం బిడేచూడు
రాదు యికజన్మం సింహప్రభో
సాధుసంసేవితా నే దురాత్ముడను
నీదు పాదసేవకునిగా జేయి సింహప్రభో॥ శ్రీ.

54. శంఖుచక్ర గదఖడ్గ శార్ఙ్గహస్తా
శంక లేటికి నాతో సింహప్రభో
పంకేరుహనాభా పవనతనయస్తోత్రా
ఝంకరురా నార సింహప్రభో॥ శ్రీ.

55. శంకరస్తుతపాత్ర నిరాకరింపకురా మీ
నాంకజనక నార సింహప్రభో
ఝాంకారా రీంకార నన్ను చైజారవిడచుట
పొంకమో ఏరా సింహప్రభో॥ శ్రీ.

56. వారిజగాత్ర శ్రీ వనజాతనేత్ర నన్ను
పరిశోధింపకురా సింహప్రభో నీ
పరిశోధనలకు నే పాత్రుడా శ్రీహరి
హరిహరిశ్రీ నార సింహప్రభో॥ శ్రీ.

57. కరిరాజునేలిన కౌస్తుభవక్షమ
కరినిద్రుంచిన నార సింహప్రభో
దరిలేనివారలకు దారిజూపెధాతవు నా
దారిద్ర్యముల్ మాన్పు సింహప్రభో॥ శ్రీ.

58. రాజ రాజులమేటి రావానందముగ
రాజీవదళాక్ష సింహప్రభో
నాజీవనమాసి నిజభక్తినియ్యరా
రాజరాజ నార సింహప్రభో॥ శ్రీ.

59. భజనానందనా సదాభజింతు భాగ్య
మజేగూర్చు శ్రీనార సింహప్రభో
సుజనావన నా కన్నులమెందు
గజూచె దెన్నడో సింహప్రభో॥ శ్రీ.

60. గజ్జలందెలు ఘల్లుఘల్లని మ్రోయ
గజముపైరారా సింహప్రభో
ముజ్జగములకు మూలమైనట్టి ఓ
సజ్జనపోష నార సింహప్రభో॥ శ్రీ.

61. లజ్జవిడిరావే సీతో ముచ్చటలాడెద
మజ్జనమాడి శ్రీనార సింహప్రభో
బొజ్జలో నిడుకొని రజోతమగుణములవి
సర్జనశాయవే నార సింహప్రభో॥ శ్రీ.

62. ముచ్చుసోమకుని ద్రుంచి వేదము లజాన
కిచ్చిన శ్రీనార సింహప్రభో
పిచ్చివానిగా జేసి రచ్చలో బెట్టుట నీకు
వచ్చేటిఫలమేమి సింహప్రభో॥ శ్రీ.

63. వచ్చేటి మంచి చెబ్బరలన్నిటిని మీకు
యిచ్చివేసినాను సింహప్రభో
కుచ్ఛితుడని నాపై కోపముశాయక
లచ్చిమొగడా నార సింహప్రభో॥ శ్రీ.

64. కూర్మరూపముదాల్చి కొండమూపుననెత్తి
కూర్మితో అమృతందఱుచిన సింహాప్రభో
చేర్మికదపద్మా రాధనముశాయ
నిర్మలుండై కోరితి సింహాప్రభో॥ శ్రీ.

65. ధర్మకర్మ యీరెంటినిధరణిని
నేర్మరచేదెన్నడు సింహాప్రభో ంగా
నర్మిలిదేహాని నీకెయొప్పగించి నిజా
సీర్మమందేయున్న సింహాప్రభో॥ శ్రీ.

66. వరహావతారమై వసుధకొమ్మననెత్తి
సురులరక్షించిన సింహాప్రభో
ధరహాసవదన యిక దర్శనమివ్వరా నే
నిరుపేదనై నున్న సింహాప్రభో॥ శ్రీ.

67. శరణార్థినీకే శరణు శరణు శరణు
శరణు శరణు నార సింహాప్రభో
భరణా భవభయహరణా నిర్భయుడై నిన్నె
శరణొందియున్న నార సింహాప్రభో॥ శ్రీ.

68. పరశురాముడవై పరుసరాజులతో
అరసి పోరాడిన సింహాప్రభో
సరసిజనేత్ర నన్ను నగయంగశాయక
నా సరివారిలోముంచి సింహాప్రభో॥ శ్రీ.

69. దశరథసుతుడవై తాటకినిమర్దించి
కౌశికునిగాచిన సింహాప్రభో
శేశమైన నినుదలచి యానందమొందని
యీశరీరమెందుకో సింహాప్రభో॥ శ్రీ.

70. పసుపతినుతమంత్రా దశముఖుతమ్మునికి
శాశ్వతపట్టముగట్టిన సింహప్రభో
కసుమాలకట్ట కెంతో కడిగిపోసిన
ఆశలుమానదే సింహప్రభో॥ శ్రీ.

71. కృష్ణావతారుడై దుష్టకంసునిశిఖను
బట్టిచంపినట్టి సింహప్రభో యీ
కృష్ణుకువలువలు కృపతోనొసగి
దుష్ట కౌరవులగూల్చిన సింహప్రభో॥ శ్రీ.

72. వైష్ణవశివ మతస్థులు గూడి శివ
వైష్ణవమతభేద మెంచేరు సింహప్రభోయీ
వైష్ణవశివమత భేదములేలేక ఏక
విష్ణువేయున్నావే సింహప్రభో॥ శ్రీ.

73. ఏకవిష్ణువే సర్వ మైక్యమైయున్నదని
అకలంకచిత్తులొప్పగ జేరు సింహప్రభో
శోకమందు నిష్కామురైయున్న నన్ను
శోకింపశాయకు సింహప్రభో॥ శ్రీ.

74. ఆకలనేవారికి అన్నముబెట్టని యీ
దేగమెత్తిం దెందుకో సింహప్రభో
జాగేల మనకేలనుంటె జగాన ఘ
టికాద్రివాసు డంటారా సింహప్రభో॥ శ్రీ.

75. కలియుగమందున భక్తుల హృదయాన
వెలుగుచుయున్నావే సింహప్రభో
కలికి నావలుకు నాలకించియుంటె మదిలోన
చిలికివేతురా నార సింహప్రభో॥ శ్రీ.

76. తెలివిమాలిన బుద్ధిహీనునికి
తెలివి తెలియజెప్పరా నార సింహప్రభో
తెలివిని తెల్ప ఘనుడానీకంటె
తెలివి దెల్పెవారెవ్వరు సింహప్రభో॥ శ్రీ.

77. వెయినోళ్ళవాని పై నలయక గూర్చు
న్న యా వైకుంఠపురవాసా సింహప్రభో
నెయ్యిచక్కెర తేనె అరటిపండు నీ
కుయింపుగా నిచ్చెను గాను సింహప్రభో॥ శ్రీ.

78. శ్రీయుతరాతిలో కప్పకు యాహా
రంయిచ్చు ధాతగాదా సింహప్రభో
నేయున్న చోట నుండి నిను కనుగొన నేర
యాయుపాయము దెల్పు సింహప్రభో॥ శ్రీ.

79. యెట్టినోము నోచి యిట్టికష్టముబడ నా
నోష్ట్రవ్రాతనా నార సింహప్రభో న
న్నటెట్టు పోనీక నీగుడిచుట్టుతిరిగెద నా
పట్టి యిష్ట మేడేర్చరా సింహప్రభో॥ శ్రీ.

80. కట్టివేసినమనసు కట్టుకణుగదు
కట్టి యిష్టసిద్ధియగా నార సింహప్రభో నా
పట్టితనముజూచి నన్ను నెట్టిద్రోయక మదిని
పట్టికట్టివేతు సింహప్రభో॥ శ్రీ.

81. నావెన్నముద్దు నిన్నెంతని వేడుదు యో
భువనేశ్వరరావే సింహప్రభో
ధృవుడాడిన తేట పలుకులాలకించి
తీవ్రపదవినిని స్తివే నార సింహప్రభో॥ శ్రీ.

82. యావేశుడై భువి ప్రజలకెల్ల యా
యావరములిచ్చుచుండే సింహప్రభో మీ
కోవిలచుట్టున్న తీర్థాలెల్లనుగని
సేవించె దెన్నడో సింహప్రభో॥ శ్రీ.

83. పాదతులసీతీర్థ మాదారము నిత్యం
మధుకైటసంహారా సింహప్రభో
యాదవులకై మం దరగిరిని నెత్తి
గొడుగుగాబట్టిన సింహప్రభో॥ శ్రీ.

84. మదనగోపాలుడై గోపగోపికల భీష్ట
ముల్దీర్చిన నార సింహప్రభో
యధమానికే నే వాలాయమైయున్న
ఆదరించరా నార సింహప్రభో॥ శ్రీ.

85. కలలోనైనా కనుపడరాదా
జలజనాభ జ్వాల సింహప్రభో
కాలునిదూతల పాలుశాయక నిన్ను
కలచియున్న నార సింహప్రభో॥ శ్రీ.

86. కోలాహలుడై యున్న నీకోలువును జేసేటు
యిలకొంటతయేమిరా నార సింహప్రభో
యీలాగుశ్రమలుంచ యిది నీకున్యాయమా
శ్రీలోలా నార సింహప్రభో॥ శ్రీ.

82. మంగళాంగవైభోగ ఖగతురంగ సత్య
మంగళంతే సదా సింహప్రభో
ఎంగలనక శబరిచ్చినపండ్లను
అంగప్రీతిగభుజించిన సింహప్రభో॥ శ్రీ.

88. సంగరవిజయ సత్సంగముగూర్పక
కుంగబెట్టవేరా సింహాప్రభో
సింగరూపుడై అంగాంగంబులు బెదర నాలో
పొంగుచుయున్నావే సింహాప్రభో॥ శ్రీ.

89. నీలమేఘవర్ణా నీ వెందుబోతివి యా
పూలమేడవిడచి సింహాప్రభో
పూలమేడమీద పుష్పంబైవికసించె
జ్వాలా పూరించియున్నావే సింహాప్రభో॥ శ్రీ.

90. వలదావలదు అమృతవల్లి ప్రాణేశా
వలరాజు శాకులపొందు సింహాప్రభో
చలనివానా నీ చల్లనికృపయుంచి ని
శ్చలునిగా జేయు సింహాప్రభో॥ శ్రీ.

91. శంభువినుతా తుంబురుపాదా
వంబుకు పాత్రుడా సింహాప్రభో నాడు
స్థంభంబున యా విర్భవించిన దేవా
కుంభి బాధదుమ్ము సేయి సింహాప్రభో॥ శ్రీ.

92. రంభాదిరమణులు నాట్యమాడంగ
జంభారినుత సేవగల్గె సింహాప్రభో
కంబుగ్రీవాదు లాశీర్వదించి నిజ
పదంబునిచ్చిన నార సింహాప్రభో॥ శ్రీ.

93. సోమసూర్యుల కన్న మిక్కిలికాంతిగా వెలిగే
శ్యామళవర్ణా శ్రీనార సింహాప్రభో
తామదమొంచక నామనంబుననుండి
నీమందిరంబు జేర్చు సింహాప్రభో॥ శ్రీ.

94. రామమహాధీరా నాలేమి తనముజూచి
యేమిజెప్పకున్నావేమి సింహప్రభో
పామరుడైనను జపముల్మరచి పాప
కర్మినైతివి నార సింహప్రభో॥ శ్రీ.

95. సర్వాపరాధిని సదా జూచిసాకుచున్న
సార్వభౌమా నార సింహప్రభో
పార్వతిపతిమంత్రా సర్వాత్ములను బట్టి
యుర్విని పోషించుచున్నావే సింహప్రభో॥ శ్రీ.

96. పూర్వాకృతముచే పూజింపగంటిని
దూర్వాసవందితా సింహప్రభో ఆ
యుర్వేదముల్చదివి నిన్ననుష్ఠింపగలేదురో
సర్వేశసదయ సింహప్రభో॥ శ్రీ.

97. త్రివిక్రమశౌరే శ్రీహరెమురారే
భువివిచారవరాకేటికి సింహప్రభో
చెవికింపుగాయుండే సచ్చరిత్రమేజాలు
సేవితారక్షితా సింహప్రభో॥ శ్రీ.

98. కవిదోషములకు కట్టుపడియుండక యూ
కవినీదెగాదా సింహప్రభో.
యేవివేకమెరుగ నిన్నే యెప్పొద్దుజూతురా
కవిదోషహరనార సింహప్రభో॥ శ్రీ.

99. నిష్టప్రణీతము లెంచిచూడగలేను
దుష్టరాక్షసహరనార సింహప్రభో నా
యిష్టదైవమా నీకుదృష్టితాకనేము
అష్టయిశ్వర్యలక్ష్మి నార సింహప్రభో॥ శ్రీ.

100. సృష్టికర్తజనక నాయిష్టదేవుడైయిష్టా
ర్థీష్టముల్ పూర్తిశాయు సింహాప్రభో
దాష్టీకమింతైన లేకపోతేనిను పర
మేష్టియనతగునా సింహాప్రభో॥ శ్రీ.

101. చేతనాచేతనుల చేబట్టిబ్రోచేటి
ధాతవుయతిపతినార సింహాప్రభో
మోతనా నమ్మోదమునసేవునా
పాదనుడైయుండ సింహాప్రభో॥ శ్రీ.

102. ప్రాతనా బలిమాలితినని పరి
శోధననాయఘోరనార సింహాప్రభో యీ
ఘోరరూపముజూడ నాకుభయముతోస్తున్నది
శాంతరూపమరారా సింహాప్రభో॥ శ్రీ.

103. రక్షయార్తరక్ష పరీక్షింపకరారా
కక్షమైనాయందు సింహాప్రభో ము
ముక్షులకునిత్య శుభములిచ్చుచుండు
మోక్షప్రదాయక సింహాప్రభో॥ శ్రీ.

104. రాక్షసాంతక లక్ష్మీరమణసాధుసం
రక్షయీక్షణంబే నార సింహాప్రభో
వీక్షించుమముక టాక్షించు రక్షించు
సాక్షాత్కారుడైయున్న సింహాప్రభో॥ శ్రీ.

105. వాదానీదయ రాదాపదవి
రాదా వరదద్విరద సింహాప్రభో
వేదానినుభజించ లేదా సదా
పాదాబ్జమొక్కెదనార సింహాప్రభో॥ శ్రీ.

106. వేదావినియమం దవవాదా భేదా
భూదా బుధజనోద్ధారా సింహప్రభో
భోదా త్రిభువన నాదా ప్రఖ్యాదానే
బీద అబలుని సింహప్రభో॥ శ్రీ.

107. కపీశ్వరవరనే కుపితునిహీనుని
అపవాదుడనైయున్న నార సింహప్రభో నా
యపవాదులను నాకీప్రొద్దె తొలగించియే
నెపము లేక బ్రోవు సింహప్రభో॥ శ్రీ.

108 ప్రాప్యమై గోప్యమై దివ్యమైయున్న నీ
ప్రాపెగోరెన ప్రసన్న సింహప్రభో
సుభద్రమునై సౌలభ్యమై మెలగుచు చెలగుచు
సంభ్రమమై తీతమైయున్న సింహప్రభో॥ శ్రీ.

మంగళంవర ఘటికాద్రీశ్వరా జయ
మంగళంసదా సింహప్రభో
మంగళంశ్రీరా ఘువదానప్పా శుభ
మంగళంమామవ సింహప్రభో॥ శ్రీఘటికాద్రి.



శ్రీ ర స్తు.

శ్రీ ఘ టి కా చ ల

# లక్ష్మీనృసింహ నామ సంకీర్తనలు.

(2) వ, ర న.

1. పాహిమాంపాహినరసింహ- పాహిఘటికాద్రివై దేహి
పరబ్రహ్మ॥ పాహి.
2. ఘటికాద్రివాసా ఓంనరసింహ- పటుతరము బ్రోవవే
పరబ్రహ్మ॥ పాహి.
3. శంకరప్రియ ఓం నరసింహ- యిక- శంక లేటికినాకో
పరబ్రహ్మ॥ పాహి.
4. పాదారవిందములునర, నా-కాధారమునిత్యంపరబ్రహ్మ॥ పా.
5. వందనమిడుగో నర, నా- మందబుద్ధినికొయ్యవే పర॥ పాహి.
6. యెందరుండిననేమి నర, నాకు-దురంతరమే ఓంపర॥ పాహి.
7. దేహబాధవల్ల నర, బహుసంకటపడితి పర॥ పాహి.
8. బుద్ధిబుద్ధి ఓంనర, మందబుద్ధితో వేడితి పర॥ పాహి.
9. ప్రహ్లాదప్రత్యక్ష నర, ఆహ్లాదముగ రారా పర॥ పాహి.
10. ఆదినారాయణ నర, నేనేదియెరుగనిత్య పర॥ పాహి.
11. రామావతారమున నర, రాక్షసులమర్ధించిన పర॥ పాహి.
12. కృష్ణావతారమున నర, దుష్ట కంసునిజంపితివే పర॥ పాహి.
13. మత్స్యావతారమున నర, సొచ్చిసోమకునిద్రుంచితివే పర॥

14. తామసింపనేలనరసింహా- తనువుతావునజేర్చండిపరబ్రహ్మా॥

15. స్థంభమునవెడలినరసింహా- డింభకునిద్రుంచితివేపరబ్రహ్మా॥

16. నరసింహా నరసింహా నరసింహా - నరావతారుడ ఓం పరబ్రహ్మా॥ పాహి.

17. వేరుశాయుబోకు నర, నాకు వేరేగతిలేదు పర॥ పాహి.

18 భక్తవత్సల ఓంనర, భక్తి భిక్షముబెట్టవె పర॥ పాహి.

19. నాశక్తికొలది నర, మిమ్ము భక్తితో వేడెద పర॥ పాహి.

20. శ్రీశ్రీనివాసా ఓంనర, నన్ను శీఘ్రిమే బ్రోవవే పర॥ పాహి.

21. శేషశయన ఓంనర, నాదోషములెంచక పర॥ పాహి.

22. భూషణదూషణ నర, మీకే- అర్పణము ఓంపర॥ పా.

23. వామనావతార నర, నామొఱాలకించవే పర॥ పా.

24. సామజవరద ఓంనర, నామజపమేదిక్కు- వోంపర॥ పా.

25. భూమిజనాయక నర, యికబుట్టక చెయ్యవే పర॥ పా.

26. కామితఫలదాయకనర, కామక్రోధముల్ గూల్చవేపర॥ పా.

27. వెంకటాచలపతి నర, నా వెంటనేయుండవే పర॥ పా.

28. సంకటహరణా వోంనర, సత్సంగముగూర్పవే పర॥ పా.

29. యింకైనదయరాదా నర, యికెయెక్కడబోదురా పర॥ పా.

30. రవ్వంతసేపిటు నర, బువ్వ ఆరగించిబో పర॥ పా.

31. చూపులోచూపి నర, నీవు చూపైయున్నావె పర॥ పా.

32. పాపిల్లోపాపినై నరసింహా- సిగ్రాపెగోంటి పరబ్రహ్మా॥ పా.

33. చర్మమువదల వోంనర, ఒక మర్మముజెప్పవే పర॥ పా.

34. ధర్మముశాయవే వోంనర, నావద్ద ద్రవ్యములేదె పర॥ పా.

35. నిర్మలానంద వోంనర, యేతీరుజేస్తావో పర॥ పా.

36. కర్మాననుండి వోంనర, కరముఎత్తిమ్రొక్కితిని పర॥ పా.

37.గోవిందకృష్ణ ఓంనరసింహ - నా కోర్కెలీడేర్చరా
పరబ్రహ్మ॥ పాహి.
38.ముకుందకృష్ణ వోంనరసింహ- నా ముందునిల్వరా
వోం పరబ్రహ్మ॥ పాహి.
39. వోం హ్రీం వోంనరసింహ- వోంకారస్వరూప వోం
పరబ్రహ్మ॥ పాహి.
40.బలరామావతార నర, బలముండగభయమా పర॥ పా.
41.స్థళమేమికులమేమి నర, కులస్థళముకూడవచ్చా పర॥ పా.
42.మాతండ్రివిగాదా నర, మనసేలబుట్టదు వోంపర॥ పా.
43.కంటికిరెప్పవలె నర, మీరుండికాపాడండి పర॥ పా.
44.నీస్వరూపముజూపిన నర, యేస్వరూపములంటవు పర॥ పా.
45.యీవేళరావయ్యా నర, నాకెవరున్నారయ్యా పర॥ పా.
46.పరశురామావతార నర, పరిపాలించెదావు పర॥ పా.
47.చంచలనివాస నర, నిన్నాశ్రయించితి వోంపర॥ పా.
48.కలికావతారవోం నర, కలుషములుబాపవె పర॥ పా.
49.చలిజ్వరబాధను నర, నాదుచల్లగాజేసితివే పర॥ పా.
50.ద్రుపతినిగాచిన నర, పుత్రభాగ్యములుసతమా పర॥ పా.
51.వందనమిదిగో నర, యిక నన్నందుకోవె వోంపర॥ పా.
52.ప్రపంచవాసా వోంనర, ప్రత్యక్షమైయున్నావే పర॥ పా.
53 యిందీవరాక్ష నర, నాలుండేదినీవేరా పర॥ పా.
54.మందహాసవదన నర, నీధ్యానమందేచింత పర॥ పా.
55.మొదునీవెరా నర, మీమనసింతవింతలా పర॥ పా.
56.అమృతవల్లీశా నర, మీనామామృతమేదిక్కు పర॥ పా.
57.హేమ్మృదుభావ ఓంనర, హేమాత్మునిదునిమిన పర॥ పా.

58. నీమృదుపదములె నరసింహా- మమశరణమ్మయ్యా పరబ్రహ్మా॥ పాహి.

59. కథామృతముగోరుజిహ్వా నరసింహా- శ్రీనాథాజగన్నాథా పరబ్రహ్మా॥ పాహి.

60. ఆఘోరరూప ఓంనరసింహా- ఘోరదుఃఖమెన్నడువదలు పరబ్రహ్మా॥ పాహి.

61. వారణముఖతుండును నర, నివారించినట్టి ఓంపర॥ పా.
62. నేరనేనినుపొంద నర, నేరుగారారా వోంపర॥ పా.
63. జారచోర వోంనర, నన్ను చైజారవిడకురా పర॥ పా.
64 అప్రమేయవరద నర, నాయుల్పగుణమెంచియుండక పర॥ పా.
65. సుప్రసన్నాంభవతు నర, ప్రసన్నుడైగోరితి పర॥ పా.
66. ప్రసన్నజనశరణ్యా నర, అతిగోప్యమైవెలిగేవె పర॥ పా.
67. ప్రపంచవాంఛవదల నర, ప్రసన్నమానేను పర॥ పా.
68. కరివిభీషణాదుల నర, నాను అరసిబ్రోచినతండ్రి పర॥ పా.
69 శరణార్థినిగావు నర, హరి శరణుశరణుశరణు పర॥ పా.
70. దరిలేనివారల నర, దరిజేర్చెధాతవురా పర॥ పా.

71. సిరినాథనీసరిలేరు నర, మాకు సిరులిచ్చిరక్షించు పర॥ పా.
72. నిరుపేదనురారా నర, నీరూపెమెందున పర॥ పా.
73. ఆటిటమూడిట నర, నేనలనటబడలేను పర॥ పా.
74 వరఘటికాద్రివాసుడై నర, కోరినవరములిచ్చుచుండే పర॥
75. పాడివేశినరావే నర, నీగుడిచుట్టుతిరిగెద పర॥ పా.
76. మూడుమూర్తులకాది నర, మూలమైయున్నావే పర॥ పా.
77. వశికుచేలునికి నర, వుడగనిసంపదలిచ్చిన పర॥ పా.
78. పశితిసాష్టాంగముగ నర, పటుతరభక్తినిమ్ము పర॥ పా.

79. నీసాటి వేల్పులుగలరా నరసింహ- నోటిమాటకరువా
పరబ్రహ్మ॥ పాహి.

80. హఠయోగ వేషస్తుతా నరసింహ- నీనటనసేతురా
ఓంపరబ్రహ్మ॥ పాహి.

81. ధాటిగనిన్నన్న నరసింహ- దృఢభక్తిచాలదురా
ఓంపరబ్రహ్మ॥ పాహి.

82. కోటిసూర్య తేజా నర, నామ పఠనగావలరా పర॥ పా.
83 చిన్ననాటనుండి నర, నేనీసేవ జేయుచున్న పర॥ పా.
84. నన్నిటుశాయబాగా వోంనర, నీవుకన్నబిడ్డగాదానే పర॥
85. మన్ననంతో నాదు నర, నాదుమనవివినుమన్న పర॥ పా.
86. నీవునేనైయున్న నర, నాకికచాపుపుట్టుక లేదు పర॥ పా.
87. ధృవునినేలినతండ్రి నర, యిక దూరానయుండక పర॥ పా.
88. మౌనివ్రతముబూని నర, నీవుమాట్లాడకున్నావె పర॥ పా.
89. ఔర వైరమానాతో నర, యిక రాగముతప్పను పర॥ పా.
90. వేయారువిధముల నర, నే వెతలోబడియున్న పర॥ పా.
91. చేయరానిదెల్ల నర, చేసితిక్షమశేయు పర॥ పా.
92. యీకాయమస్థిరమనినర, నీసాయుజ్యమేకోరియున్న పర॥
93. భయదనివారర్పం నర, మీదయకేగాచియున్న పర॥ పా.
94. లక్ష్మీశలక్ష్మీశ నర, లక్ష్మీవక్షరక్షమాం పర॥ పా.
95. దీక్షవహించి ఓంనర, నేడు దీక్షచేసాధింతు పర॥ పా.
96. పక్షివాహానుడై నర, పక్షపాతములేకబ్రోవు పర॥ పా.
97. ముముక్షులకుమూలమై నర, మోక్షమిచ్చుచున్నావె పర॥
98. నీదినాదనే నర, యీ భేధము తెగవలె పర॥ పా.
99. నీయాధారములేక నర, క్రోధాదులువెళ్ళవు పర॥ పా.

100. చదివినవినిన నరసింహా- మీకథచదివివినవలె
పరబ్రహ్మ॥ పాహి.

101 మీదివ్యనామమే నరసింహా- సదామెదలుచున్న
పరబ్రహ్మ॥ పాహి.

102. వడవడవణకుచు నరసింహా- మీ తిరువడిగళుగాచియున్న
పరబ్రహ్మ॥ పాహి.

103. పడరానిబాధలు నర, పడితికచాలురా పర॥ పా.

104. చెడుగుణములుకొయ్యవే నర, నడచివచ్చెదమీకొండకు
పర॥ పా.

105. అంగదాదులచేరి నర, మంగళంబనిపాడెదరు పర॥ పా.

106. జయమంగళమునీకు నర, నిత్యశుభమంగళమునీకుపర॥ పా.

107. కర్పూరహారతులు నర, సమర్పించెదచేకొనుము పర॥ పా.

108. ఓర్పుతోరాఘవదాసుని నరసింహా- నేర్పుమీరబ్రోవు ఓం
పరబ్రహ్మ॥ పా.

పాహిమాంపాహి నరసింహా
పాహిఘటికాద్రివైదేహి పరబ్రహ్మ.



శ్రీ ర స్తు.

శ్రీ ఘ టి కా చ ల

# లక్ష్మీనృసింహనామ సంకీర్తనలు.

## (3) వ, కీ ర్త న.

ప॥ నారసింహనన్నుబ్రోవరా- ఓం-నారసింహ॥ నార.
అప॥ నారసింహుని-పాడిన- నోట- పూరసింహుని పాడబోను॥
నార. చర॥ ఘోరభయుని- వారించర- కోరినన్ను గొలుచుచును
న్న - వీరకరధృత- ఖడ్గ- ఓంకారనిలయ- సర్వాకారా॥ నార॥
మారుతినుత-మర్మమేరా-నోరు తెరచి-నామమంత్రమూదరా-
నీ- మూర్తికరము- యేమందు- మురారి- నగధరశౌరి॥ నార॥
వరప్రహ్లాద-భక్తునికొఱకు- వుక్కు-స్థంభమందు వెడలి- హిర
ణ్యకశ్యపుని- ద్రుంచిన- ఓం- నరమృగశరీరసదా॥నార॥ శ్రీఘ
టికాద్రి- పురవర- స్థిరమతితో వేడలేరా- కోటి- సూర్యతేజ-
నోటిమాటకరువా - యేరా- ధీరా॥ నార॥ యోగీశహృత్సర
ణ- రాఘవదాసా- వనభరణ- జగతీనాథ - జాగేల- రోగభ
య- నివారణ-ధారణ॥ నార॥

## (4) వ, కీ ర్త న.

రాగము - యమునాకల్యాణి - అటతాళము.

ప॥ అమ్మా-అమృత- వల్లమ్మా- మాయమ్మా- నమ్మి
తి- మాయమ్మా॥ అప॥ యిమ్మహి- నీసమాన- దైవమెందుగా

న- యమ్మానమగన్న- అమ్మ- మాయమ్మా॥ అమ్మా. చర॥ నరసింహునిరాణి- శ్రీమన్నారాయణి- నీరదనీలవేణి - వరఘటికాద్రీశుని- వక్షస్థలమున- విరివిగ నెలకొన్న- వీరి- హృత్సరసి. అమ్మా॥ సన్నజాజులు మల్లె- మొల్లలుగల తులసితో- నిన్నర్చింతునేయమ్మా-వన్నెమీరినయా - నెన్నుదురాడాయె - కన్నులైనిన్ను నే- సన్నుతిజేసేను. అమ్మా॥ మీ- యనుమతి మీద- నే- నీకార్యంబెత్తితి- అనుమానమేలనమ్మా- యోనులందుమరిగి- చెడి- యున్ననన్ను- మీపసివానిగాజేసి- పాదసేవీరాదా అమ్మా॥ శోళంఘిపురీశ్వరీ- శోభనంతే దివ్యమంగళాంఘ్రియుగళేశ్వరీ- ని-త్య-కళ్యాణహారీ- యీ- నిమ్నయోజనకుని- గుణ- కళ్యాణములేక బ్రోవు- నళిన-దళనేత్రీ. అ॥ పవనతనయనుతే- యీగాధనేనెట్లు-సేవేహం సేవేహమమ్మా-పావని-రాఘవదాసుని భారము నీది-నీవేసరి-భారతి- గౌరిస్తోత్రి. అ॥

## (5) ప, కీ ర్త న.

ప॥ ఘటికాద్రిలక్ష్మీనృసింహ- నామమహాకే- పాలింపనీ సరివేల్పు లేదునాకే. అ॥ ధాటిగనవ- బ్రహ్మాదాది- పృథివిసురులకు- ప్రత్యక్షమైన- కోటిసూర్యతేజా- నామ-శరణజేసిద- గతినిజూపరా॥ ఘటి. చర॥ ఘోరభయనివార- సద్గురువరకోరెద నిసేవరా- జార-చోర-నన్ను- దైజారవిడచుట- మేరగాదురా. వీరకరధృత - ఖడ్గ- వోంకారనిలయ - నిర్వికారా. ఘటి॥ సకలజీవపోష- సద్గుణభూష. సహించలేను ఘోష- చక్రధరని- శౌర్యబలమున- హిరణ్యపరాక్రముడుగూలె - అగ్రజాధిప- అమరవందితా- యతిశీఘ్రింబున - నన్నేలవే. ఘటి॥ శోళంఘిపురనాయకా- జ్వాలా - నరసింహశుభదాయకా -

మూలాధరనిన్ను తెలియక- మూర్ఖవాదులతో చేరి - మేల గుమీవదభక్తిని-మరచి- మమతచే- తిరుగుచున్న. ఘటి॥ వగలమారిని నేను- యేవగనైనా-గాచిననీవేను- పగలు రాత్రియు-మీ- కల్యాణగుణములే కోరియున్న- రాఘవదాసాంగమున-రగులుచుండే వరప్రసన్న. ఘటి॥

(6) వ, కీ ర్త న.

యోగాంజనేయుల స్తోత్రము.

శ్రీఘటికాద్రిని- సుస్థిరముగ- నెలకొన్న - యోగాంజనేయా- పటుతరమైనట్టి - భక్తిభిక్షము - నియ్యవే యోగాంజనేయా. శ్రీఘ॥ సర్వాపరాధిని - నన్ను నిజేసెద - యోగాంజనేయా-యుర్విమాయను దాటను- నాశరమా-యోగాంజనేయా. శ్రీఘ॥ తల్లితండ్రిగురుడైనమునీవే- యోగాంజనేయా- మర్మజ్ఞ నిర్మించని- మార్గముజూపురా - యోగాంజనేయా. శ్రీఘ. ధరలోన- నీమహిమ- యెంచిజెప్పను- నేనా- యోగాంజనేయా- వర- రాఘవదాసుని- మరువక-బ్రోవరా- యోగాంజనేయా. శ్రీఘటికాద్రిని॥

(7) వ, కీ ర్త న.

ప॥ రాఘవ- నన్ను-బ్రోవరా॥ అప॥ నాగశయన నన్న గడుబెట్టకురా- వేగరా- రాగరహిత- శ్రీవీర॥ రా. చర॥ శాలిహోత్ర-హత్జ్వలితపద్మనేత్ర- శ్రీలింగ- స్తోత్రపాత్ర- శ్రీవీర. రాఘ॥ కరుణాకటాక్ష- వీక్షారణ్యరక్ష-శరణం-నిరుపాక్ష- లక్ష్మీవక్ష- వీర. రాఘ॥ ధరతిరువళ్ళూరి- పురమునందుశౌరీ- కోరివచ్చువారి - కోర్కెలిచ్చి-వీర. రా॥ యేగతిజూపకున్న- నీకన్నదిక్కెవ్వరన్న- వగవలదురాఘవదాసాధీశ- వీర. రా॥

(8) వ, కీ ర్త న.

ప॥ దరిశనమీరా- శ్రీరాఘవా- మాధవా. అప॥ స రసమా-నీసరివాడనా- వీడను॥ దరి. చర॥ వరమదయాకరా- పాలించునన్నుదొరా- మరచుటలేదుర- నీ- స్మరణము-నీయా జ్ఞను॥ దరి. యేకరూపమైయున్న- సాకేతపురనిలయా-యేకాకి నిగానె- నిలచిన- నిన్నే- దలచిన. దరి॥ పాములపై-పవ్వళించి న- మహాప్రభో- బాములబెట్టు- వేమయ్యా- శ్రీరామయ్యా॥ దరి॥ వరతిరువళ్ళూరి - వాసరాఘువశౌరి - ధరరాఘువదాస- హృదయేశా- కనకవల్లీశ. దరి॥

(9) వ, కీ ర్త న.

ప॥ జయ- జయ శ్రీ-పాండురంగా- జయ- యండజ- గమన- శుభాంగా॥ జయ. చర॥ తాండవ- మూర్తిటురారా- నాలుం- డవగుణముల్- ద్రుంచవేరా. జయ॥ భక్తావేష-భవ హారణా- సద్భక్తపోష- శంభునుత- చరణా. జయ॥ యెన్నా ళ్ళై-శ్రమ- తండ్రీ- నను- గన్నవాడవై- యుండు. జయ॥ పండ రి- పురవర- నేత్రా-జయ- పుండరీక- స్తుత- పాత్రా. జయ॥ శ్రీరాఘవ- దాసా-ధీశా- సన్నగడు- బెట్టక- భువనేశా.జయ॥

(10) వ, కీ ర్త న.

ప॥ పాండురంగ- యిప్పుడు- పావిత్రమై- క్రాందు - కరు ణై- వ్వాసియ- లాగాదా. అప॥ యెండిగై- యోర్త్రుణ్ణ-పున్- పౌన్నడి- కమలత్తై-యెన్నాండవా- కొడుత్తాళవాదా॥ పాండు. చర॥ ఘోర- సంసార- నరగ- కూ్క-పత్తె విట్టు- కొండాడుం - వగై శెయ్యలాగాదా- వో- రణుపురు- అణువాయ్- యెంగుం నీయాయ్- యెన్నురుంతుయ్యర్ - తీర్క-వొగాదా. పాండు॥ యా

దిము... ర్తనవే - గతిప్రనైయర్పి- వేరిల్లై - శోదియాయ్- శుత్తిమాయ్- నిర్ధ్రిపరంపారుకే- శోధనైక్కు- యూనాళా- మెనయ్యా. పాండు॥ హరియే - పరకన్ రుజయ- వర- ప్రహ్లాదనుక్కాగ్- హిరణ్యనై- సం- హారిత్తవిరా- త్రి- భువనత్తెయు- మోరడియాగ్. యళందవనే- ని- నేరాగ్ వా రుం- వునదడివణంగిప్పిర్పిన్. పాండు॥ కండవర్కాణో- ట్కురు త్తిలిరుందు - మోగ్- జ్ఞాన- ముడాక్కుంబోదా- వ్రుడత్తెండ- ర్భక్తర్కనుకూలా- సూంతుశేయు- దూరనిల్లాదే. పాండు॥ శాం తన్పుండ- రీకనుక్కు ప్రత్యక్షమాగ్- చంద్రభాగాది- తీర్త్తి లుదిత్తాగ్- వైష్ణవ రాఘువ- దాసన్- సేవిక్క - తిరుక్కళ్ళ్యా రి- పురమత్తన్నాగ్. పాండ.

## (11) మంగళం.

ప॥ శ్రీఘటికా- ద్రీశునకు- జయ- మంగళం. అ॥ కుటిల- దనుజ- మద- శోషునకు శుభ- మంగళం. చ॥ అమృతవల్లీ- ప్రాణేశులకు- నిత్య- సామ్రాజ్య- వాసులకు- పంచామృత- స్నాన- ప్రియునకు- దివ్య- మంగళం. శ్రీఘ॥ పాపార్తి- భంజనునకు- ప్రపన్న- జన- శరణ్యునకు- సుపర్ణగమనునకు- ప్ర- సన్న- మంగళం. శ్రీఘ॥ లక్ష్మీ- నృ- సింహునకు- మోక్ష- సామ్రాజ్య- కారులకు- బిల్మకర- శంభు- నుతనునకు- రక్ష- మంగళం. శ్రీఘ॥ రాఘవ- దాసార్చితులకు- రాకేంద్ర- బింబాననునకు- రాగాది- ద్వేష- హారునకు- రమ్య- మంగళం॥ శ్రీఘ॥

శ్రీ ఘటికాచల లక్ష్మీనృసింహనామ సంకీర్తనలు,

సంపూర్ణము.

